Regd No. N. 43 / M 3813

102876

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ విక్రమసం॥ర మాఘ బ॥ ౧౩ (౨౩-౨-౧౩౫౧ ఫ.) సోమవారము సంచిక ౨౧

★ యుద్ధంలో పద్య వర్తిత్వానికి జపాను సూచన ★

★ బల్గేరియాలో జర్మను సేనల ప్రవేశము ★

# సింగపూరుకు అమెరికా విమానాలు

## జపాను సన్నాహాలభయంతో ఆస్ట్రేలియా సన్నాహాలు

### జపాను సేనల సంచలనములు

దక్షిణసముద్రమందు తమయొక్క క్షేమసమస్యను శాంతముగా రాయబారాలద్వారా పరిష్కరించుకొనుటయే తమ పద్ధతియని జపాను ప్రభుత్వ విదేశాంగశాఖాసహాయ మంత్రి ఓహాషీ గారు జపాను పార్లమెంటులో చేరిన ప్రభుత్వ ప్రతినిధిసభలో ఫిబ్రవరి ౧౭వ తేదీన నిర్వచించిరి. జపాను తన ఆశయములను ఆయుధబలముతో సాధించబూనుకున్నచో జపానుకే వినాశము సంప్రాప్తించగలదనివారు ఒట్టుపెట్టిరి. వితే తప్పుడువార్తలను ప్రచారముచేసి జపానును ఎవరుగాని లాంగదీయుటకు ప్రయత్నించుచో జపానుఅట్టి ప్రయత్నమును ప్రతిఘటించితీరునవియు: అప్పుడు తప్పక భయంకరఫలితములు సంభవించి తీరుననియు చెప్పిరి.

మలయాప్రాంత సముద్రపుజల్లాలలో బ్రిటిషువారు ప్రేలుడుమందు గనులను పాతిపెట్టు వార్తలను, థాయిలెండులోని బ్రిటిషువారు ఖాళీచేసెదరనువార్తయు దక్షిణపసిఫిక్ సముద్రప్రాంతంలో యుద్ధప్రారంభము కాబోవుచున్నదని సూచించునని హైకాలలో తెలుపుటకు ఉన్నారు. ఇది కేవలం బ్రిటిషువారు అనవసరముగా తీసుకొనుచున్న జాగ్రత్తమాత్రమే వారనుకొందురు. జపాను బహుశా సింగపూరు, ఈస్టు ఇండీసులపై దాడిజరపకపోవచ్చునని కూడా అనుకున్నారు ఎందుచేతనగా, వీటిపై జపాను దాడిజరిపినచో బ్రిటను అమెరికాలతో యుద్ధము తెచ్చిపెట్టుకొన్నదన్నమాట. దక్షిణపసిఫిక్ లో దాడి జరుపుటకు జపానుతన సన్నాహాలను ఇంకా పూర్తిచేసుకొనలేదట.

ఆస్ట్రేలియాలో జపాను కన్సల్ జనరల్ గా పనిచేస్తున్న అకియామాగారు తాత్కాలిక ఆస్ట్రేలియా ప్రధానియగు ఫాడన్ గారిని ఫిబ్రవరి ౧౮న తేదీ కలుసుకొని సంభాషించిరి. సంభాషణలు అనంతరము అకియామాగారు ఒక ప్రకటనలో తమకు ప్రమాదలక్షణములేమీ పసిఫిక్ ప్రాంతంలో కనుపించుటలేదని తెలియజేసెను. ఆస్ట్రేలియా, జపాను రాజ్యాలమధ్య శాంతముగా రాయబారాలద్వారా పరిష్కారం చేయలేనిస్పర్థలేమీ లేవని చెప్పెను.

పరిస్థితి అనుకూలంగా వుండేటట్లయితే యుద్ధంలోనైనా మధ్యవర్తిత్వంవహించి రాయబారాలు జరపడానికి జపానుసిద్ధంగావున్నదని ప్రభుత్వ ప్రతినిధి ఇస్లీ గారు ఫిబ్రవరి ౧౭వతేదీ టోకియోలో విదేశపత్రిక విలేఖరులకు తెలియజేసెను. ఈవిషయమును జపాను విదేశాంగమంత్రి బ్రిటనుకు తెల్పినాడు, బ్రిటిషు ప్రభుత్వంవారు దాన్ని శ్రద్ధతో ఆలోచించుచున్నారు.

జపాను ప్రభుత్వ విదేశాంగశాఖవారు అమెరికా సంయుక్తరాజ్యములలోను, జర్మనీలోను పనిచేయుటకు ఇద్దరు ప్రత్యేక రాయబారులను నియమించినారు.

ఇదివరలో అమెరికా సంయుక్తరాజ్యంలోని న్యూయార్కులో కన్సల్ జనరల్ గా పనిచేస్తున్న కనమూవాకాషుకి గారిని అమెరికాకును, ముకాటోసకూమా గారిని జర్మనీకి నియమించినారు. మామూలురాయబారులతో పాటు వీరు ప్రత్యేక రాయబారులుగా పనిచేసెదరు.

జర్మనీ ఇటలీలతో జపానుకు సంబంధమువున్నను ప్రస్తుతము జపాను లండనులోవున్న ఈస్టు ఇండీసుదీవుల ప్రభుత్వముతో రాయబారములు జరుపుచున్నట్లు ఫిబ్రవరి ౧౭వతేది జపానుశాసనసభలో విదేశాంగ సహాయమంత్రి తెలిపెను.

పోయిన సెప్టెంబరునెలలో ఆగిపోయిన రష్యా జపానులవ్యాపారపు రాయబారాలు, తిరిగి ఫిబ్రవరి ౧౭వతేదీన ప్రారంభమైనవి. రష్యాలోని జపానురాయబారి ౧౭వతేదిన తిరిగిరష్యాప్రభుత్వ వాణిజ్యశాఖమంత్రిని కలిసికొని మాట్లాడెను.

వేలకొలది ఆస్ట్రేలియన్ సేనలు సింగపూరుకు వచ్చి మలయాలో కొన్నిరేవుపట్టణాలకు రైళ్ళలో బయలుదేరినవని అధికారులు ప్రకటించినారు.

సింగపూరు ప్రాంతంలోని బ్రిటిషు విమానదళానికి ఇటీవలనే కొన్ని గొప్పవిమానాలను చేర్చినట్లు బ్రిటిషువారు ప్రకటించినారు ఇవి కొన్ని కీలకస్థానాలలో నిలుపబడినవి.

ఆస్ట్రేలియా రక్షణలను పరిశీలించినతర్వాత ఆకస్మిక ప్రమాదాలను ఎదుర్కొనుటకు వీలుగా మరికొన్ని జాగ్రత్తలుచేయబడినవని ఆస్ట్రేలియా తాత్కాలిక ప్రధానమంత్రి ఫాడెన్ గారు ఒక ఉపన్యాసంలో చెప్పిరి. పసిఫిక్ లో శాంతికిభంగకరమైనచర్య ఏదీతీసుకొనబడను మనముఖద్వారంవద్దకు యుద్ధంవచ్చినరోజున మనంఆలసించుపరిస్థితి కలిగేమని ఎవరునుఅనుకొనకూడదు అనివారనిరి.

చీనా, ఈస్టుఇండీస్, సింగపూరులలో ప్రత్యేకరాయబారులను నియమించేవిషయాన్నిగురించి ఆస్ట్రేలియా ప్రభుత్వం ఆలోచిస్తున్నది

వాణిజ్యనౌకల నిర్మాణానికి ఒకకార్యక్రమం ఏర్పాటుచేయుటకు ఆస్ట్రేలియా ప్రభుత్వం త్వరలో ఒకకమీషన్ ను ఏర్పాటుచేస్తుంది.

ఆస్ట్రేలియాలోని న్యూసౌత్ వేల్సులో విమానదాడి జాగ్రత్తలు తీసుకొనబడుచున్నవి.

పసిఫిక్ సముద్రంలోనూ, కెరిబియన్ సముద్రంలోనూవున్న అమెరికా నౌకాస్థానాలకు సంబంధించిన ఒకప్రత్యేక ఉత్తర్వుపైన రూజ్ వెల్టుగారు ఫిబ్రవరి౧౪వతేది సంతకంచేసిరి. విశేషానుమతి లేనిదే, విమానాలు ఈస్థానాలకుదూరంగా వుండవలెనని ఈఉత్తర్వులో హెచ్చరికయున్నది. ౯౦ కోసులలోపుగా ఈప్రత్యేక ఉత్తర్వు అమలులోకి వచ్చును ఇదివరలో కొన్నిరేవుస్థానాలను మూసివేస్తూ ఒకప్రకటనజరిగెను. నౌకలుగాని, విమానాలుగాని ఈరేవుప్రాంతాలలో సంచరించుగూడదన్న నిర్ణయంపైనకూడా నౌకాశాఖఅధికారాన్ని నిర్వహిస్తుంది. అమెరికావారి నౌకాశ్రయాల అభివృద్ధికిగాను ౨౦కోట్ల ౫౦లక్షల డాలర్లు ఖర్చుపెట్టుటకు ఫిబ్రవరి౧౭వతేదీన అమెరికా శాసనసభ మొనటికాఖ అనుమతించినది. ఈచట్టం ఇప్పుడు సెనేటులో ప్రవేశపెట్టబడును. గ్వామ్, సామోవా, బ్రిటనులనుండిసంపాదించిన అట్లాంటిక్ స్థానాలు మున్నగువాట్ల నౌకాశ్రయాలఅభివృద్ధి జరుగును.

అమెరికాజరిపించే రక్షణసన్నాహాలకు జపాను ప్రకటించే ఆక్షేపణలను లక్ష్యపెట్టకూడదని అమెరికానౌకాయుద్ధ ప్రధానాధికారి అడ్మిరల్ స్టార్క్ ప్రాతినిధ్యం వహించిన శాసనసభ సేనలకు విచారణచేసిన ఇదే నివేదిక ప్రచురించెను. నౌకాశ్రయాభివృద్ధినిగురించి ఈకమిటీ చర్చలు ప్రారంభించింది

అమెరికాలోని లాక్ హీడ్, కన్సాలిడేటెడ్ కంపెనీలవారి బాంబరువిమానాలు దాదాపు రెండువందలు కాలిఫోర్నియానుంచి పసిఫిక్ సముద్రంపైగా సింగపూరుకు ఎగిరిపోయినవని 'హెరాల్డ్ ట్రిబ్యూన్' పత్రిక ప్రకటించినది. ౨౦కొత్త విమానాలు (అతివేగముగాపోగలిగిన) సముద్రంద్వారా జాతీయ-చీనాసహాయార్థం పంపబడుచున్నట్లుకూడా ఇదేపత్రిక తెలిపినది. అమెరికాసంయుక్తరాజ్యవిమానశాఖలో పనిచేసి విరమించిన పన్నెండుమంది వైమానికులు నెదర్లండ్సువారి ఈస్టుఇండీసులోదిగిరనీ, అక్కడ వీరువైమానిక శిక్షకులుగా పనిచేస్తారనీ ఈపత్రిక వ్రాసినది.

రెజపానుడిస్ట్రాయర్లు, 'బాంగుకాకు' పట్టణానికి ౧౫-మైళ్ళదూరంలో (రంగూనుకు ౩౦౦మైళ్ళ దూరంలో) సియామ్ నదీముఖంవద్దకువచ్చి ఫిబ్రవరి ౨౦వతేదివరకూ వుండునని థాయిలెండు అధికారులు ప్రకటించినారు. బాంగ్ కాక్ లోని జపాను నౌకారాయబారి ఇంతకుముందు డిస్ట్రాయర్లు రావడానికి థాయ్ ప్రభుత్వంనుండి అనుమతి తీసుకొన్నాడు

ఫార్మోసాదీవినుండి, సరాసరిగాజపానునుండికూడా జపానుసేనాదళాలు దక్షిణదిక్కుకు పంపించబడుచున్నట్లు వార్తలువచ్చినవి. బహుశా ఈసేనలు హైనాన్ కుగాని ఉత్తర ఇండో-చైనాకుగాని వెళ్లుచుండవచ్చును.

ఫిబ్రవరి ౨౦వ తేదిన టోకియోలోజపాను మంత్రులూ సైన్యాధికారులూ అంతర్జాతీయపరిస్థితి నిర్ణయించిరి. నౌకాశాఖఉపప్రధాని అడ్మిరల్ హేయాడా వీలయినంతత్వరలో జపానువాణిజ్య నౌకలలోని ఆఫీసర్లను, నావికులను రిజర్వులిస్టులో ఉంచవలెననిరి

ఇదేరోజు జపానులో ఆస్ట్రేలియారాయబారి సర్ జాన్ లాథమ్ గారు జపాను ఉపదేశాంగమంత్రి మాయుచీఓహాషీ గారిని చూచిరి. "పరిస్థితివిషమించకుండాయుండవలెనన్న ఆస్ట్రేలియాప్రభుత్వం సహకారం అవసరమని ఓహాషీ నొక్కి తెలిపెనట.

జపాను శిఖరిని అమెరికాలోని జపాను రాయబారి నోమూరా గారు వివరించుచుఅమెరికా ముందుగా చరి తీసుకొనకపోయినచో జపాను,అమెరికాలకును యుద్ధంపొంచియున్నాదనిరి.

థాయిలెండు సముద్రంలో సాంగు ప్రాంతంలో బ్రిటిష్ యుద్ధనౌకలు గస్తీతిరుగుచున్నవనీ, బ్రిటిషుసైనికులు థాయిసరిహద్దులో సన్నద్ధులైవున్నారనీ వచ్చిన వదంతులలో సత్యంలేదని థాయిప్రభుత్వము ఫిబ్రవరి౧౭వతేదిన ప్రకటించినది.

జపాను యూరపుయుద్ధంలో మధ్యవర్తిత్వంవహించుననీ, జపానుప్రభుత్వప్రచురణశాఖాధికారి ప్రకటించినారు యుద్ధంచేస్తున్న రాజ్యాల కోసం పైయూమధ్యవర్తిత్వాన్ని వహించుటకుజపాను సిద్ధపడునని ఈ ప్రకటన తెలుపుచున్నది. యుద్ధరాజ్యాలు కోరకపోయినచో మధ్యవర్తిత్వమువహించే ఉద్దేశ్యము జపానుకు లేదట.

### బల్గేరియాపట్ల బ్రిటిషువిధానము

బల్గేరియాపట్ల బ్రిటిషు విధానమును బల్గేరియాలోని బ్రిటిషురాయబారి జార్జిరెండల్ గారు ఫిబ్రవరి ౧౭వతేది ఇట్లువివరించెను

"బల్గేరియా తాటస్థ్యమును స్వాతంత్ర్యమును కాపాడుటయే బ్రిటిషువారు తమవిధానములో పెట్టుకున్నలక్ష్యం. యుద్ధము బల్గేరియాకూడా ప్రాకకుండా చూచుటకూడా బ్రిటిషువారి ఉద్దేశ్యము" బల్గేరియా తనపొరుగువారగు రాజ్యాలతో స్నేహమును పెంపొందించుకొనుట బ్రిటిషువారికి సమ్మతమే. బల్గేరియా తాటస్థ్యాన్ని ధిక్కరించి, జర్మన్లు ఏదోఒకవిధంగా యుద్ధంలోకి లాగినను బ్రిటిషువారు పూర్వముకొనసాగిన తాటస్థ్యాన్ని కోరినప్పుడు, బల్గేరియాయుద్ధంలోకి దిగినట్లయితే దానికి కొంతభయంకరమైన రాజ్యముకే సంభవించవచ్చును మాత్రమే".

తుర్కీ, బల్గేరియాలమధ్య జరిగినఒడంబడికను రష్యా ఆమోదించునట్లు తెలియుచున్నది. రెండు దేశములు తమతమసరిహద్దులలో నిలిపినసేనలను తొలగించునట బల్గేరియా, యూగోస్లావియాలమధ్య ప్రదేశముపయోర్చిన విభేదాలనుపట్టుటకు రాయబారాలు ప్రారంభమైనవి తెలుస్తున్నది.

బల్గేరియాలోకి జర్మనుసేనలు ఫిబ్రవరి ౨౦వ తేది మధ్యాహ్నముతర్వాత ౪ గంటలనుండి ప్రవేశించసాగినట్లు వార్తవచ్చినది.

### ఆఫ్రికాలో ఇటలీ, బ్రిటనుల యుద్ధము

ఫిబ్రవరి ౧౯వతేదిని అబిస్సీనియాలోని జగ్గారాపట్టణము బ్రిటిషువారికి చిక్కినది. ఇటాలీయ స్థానమగు పికోల్లోఆస్త్రేలియా కూడా పట్టుబడినది.

ఇటాలీయ సోమాలిలాండులో జూబానది దాటినారు, పోరాటముసాగుచున్నది.

అబిస్సీనియా దేశభక్తులసేనలలో పురుషులతోబాటు స్త్రీలుకూడా పోరాడుచున్నారట.

అల్బేనియాలో ఇటాలీయులకు అపారనష్టము కలిగించి కొన్నిదృఢరక్షణలుకలిగిన స్థానాలనుండి వారిని గ్రీసులుతరిమివేసినారు. గ్రీకువిమానాలు యుద్ధరంగంలోని శత్రుస్థానాలపై దాడులుజరిపినవి.

బ్రిటిషువారిస్థావరములున్న ఇటాలీయువిమానాలనుండియు, ఇటాలీయస్థానాలమీద చాలాఅధికంగా బ్రిటిషువిమానాలనుండియు బాంబులువేయబడుచున్నవి. బ్రిటిషువారి బాంబులవల్ల ఇటాలీయులకు అధికనష్టముకలుగుచున్నది.

ఫిబ్రవరి౧౯వతేది మాల్టాపై ఇటలీ విమానదాడులుజరిగినవి. ఒకేరోజున ఇన్నిఎక్కువదాడులు ఇదివరకెన్నడును జరుగలేదు.

ఆనాటిరాత్రి మాల్టామీద ఆశత్రువిమానములు ఎగిరివెళ్ళినవిఅని బాంబులను వేయలేదు. కాని కొన్నివిమానములు మందుగనులు వేసినవి. సోమవారంఉదయం విమానదళములు ద్వీపము సమీపమునకువచ్చినవి. కాని ఫలములేదు.

సూయజుకాల్వప్రాంతంపైన ఇటాలీయువిమానాలు ఫిబ్రవరి౧౭వతేదిఉదయం దాడి జరిపినవి. బాంబులుపడినవిగాని ఆస్తినష్టపడుటగాని, ఇతర ప్రమాదాలుసంభవించుటగాని జరుగలేదు. దిగువ ఈజిప్టుకుచెందిన కొన్ని తూర్పుప్రాంతాలలోనూ విమానదాడి హెచ్చరికలు జరిగినవి.

### ఇంగ్లాండు, జర్మనీల యుద్ధం

ఫిబ్రవరి౨౦వతేదిరాత్రి దక్షిణఇంగ్లండు, తూర్పుఇంగ్లండు దక్షిణవేల్సులపైన జర్మనువిమానాలు రాత్రి దాడిచేసినవి, అర్ధరాత్రికిగానే దాడులుఆగిపోయినవి, దాడిజరిగినంతసేపూ అనేకప్రాంతాలలో మంటలుచెలరేగినవి. కాని వాటినిసకాలంలో ఆర్పినారు. ఇతరభవనాలకూ నష్టం వాటిల్లినది. కొందరికి ప్రమాదాలుసంభవించి, మరణించిరి. దక్షిణ ఇంగ్లండులోకూడా కొన్నిగా బాంబులుపడి, ప్రమాదాలు సంభవించినవి, ఆగ్నేయఇంగ్లండులోకూడా కొన్నిచోట్ల కొన్నిబాంబులు పడినవి. లండనుప్రాంతంలోని గ్రామప్రాంతాలలోకూడా బాంబులుపడి ఆస్తినష్టం, ప్రమాదాలూసంభవించినవి. ఇట్లేప్రతిరోజు జర్మనువిమానాలదాడులు సాగుచున్నవి.

బ్రిటిషువిమానాలు వసంతకాలంలో జర్మనీపై గొప్పగొప్పదాడులు జరుపబోతున్నవి. కాబట్టి అందుకు సిద్ధపడవలసినదిగా జర్మనీలో ప్రచారం జరుగుచున్నదట. రాబోయేఆపదవానికి ప్రజలు సిద్ధంచేయబడుచున్నారు, ప్రమాదానికి వీలయినపట్టణాలనుండి ప్రజలు ఖాళీచేస్తున్నారు. వియన్నాకంటే నూరుసదేశంవరకు గల విమానాశ్రయాలు తనిఖీచేయబడి పునర్నిర్మాణము చేయబడుచున్నవి.

నార్వేసముద్రతీరంలో జర్మనుల అధికారం క్రిందను "డే ఒక నార్వేనౌకను ఒక బ్రిటిషుజలాంతర్గామినౌక నాశనంచేసినది.

లండనులో ఫిబ్రవరి ౧౭వ తేది బ్రిటిషు పార్లమెంటుహౌస్ సభలో బ్రిటను ఆహారపరిస్థితిమీద సమీక్షచేస్తూ బ్రిటిషు ఆహారమంత్రి లార్డ్ వుల్టన్ ఇదివరకుకంటెకూడా ఎక్కువనిర్బంధాలను బ్రిటను సిద్ధపడవలెననెను. "బ్రిటను చాలానౌకలను నష్టపోయినది ఇంకానష్టపోవును అయినను బ్రిటన్ కు సముద్రాలపై అధికారంపోలేదు. ఇంకామనకు దిగుమతులు వస్తూనే ఉండును. నౌకలవిషయమై తీసుకొనవలసిన జాగ్రత్తలు హెచ్చడంవలన దిగుమతుల పరిమితితగ్గినది. ఈదేశానికి తీసుకరాబడుతూన్న ఆహారసామగ్రిని మానవాదులను డి ప్రమాదంలేకపోలేదు." అనివారు చెప్పిరి.

### గ్రీసుపై జర్మనువిమానాలు

ఫిబ్రవరి౧౭వతేది

గ్రీసుపై జర్మన్ విమానాలు పశ్చిమోత్తర సంచారంచేసినవి. ఇటలీపై గ్రీస్ జరుపుతున్న యుద్ధం మానుకొనుటకు గ్రీస్ ను హిట్లరు భయపెట్టుటకు చేస్తున్న చర్యగా ఈ సంచారాలు భావించబడుచున్నవి. గ్రీకుసరిహద్దుకు సేనలను పంపించుటకుముందు హిట్లరు బెదిరింపులుచేసి చూచునట.

జర్మన్ విమానాలు బాంబులేవీ వేయుట లేదు. గ్రీకులువాటిపై కాల్పులుచేయలేదు.

### అమెరికాలో అరువు, కవులు బిల్లు

"జర్మనీ యుద్ధంలో గెలిచినచో అమెరికాకు ఒక్క జర్మనీయేకాదు, ప్రపంచమంతా విరోధముగును అనికవులుఅరువుబిల్లుమీద ఫిబ్రవరి ౧౭వతేదీన అమెరికా సెనేటులో చర్చను డెమోక్రటు నాయకుడు సెనేటర్ బార్క్లీ ప్రారంభించుచుచెప్పెను.

ఫిబ్రవరి౧౭వతేదిన చర్చలో ప్రతిపక్షసభ్యుల వాదనను సెనేటర్ క్లార్క్ ప్రారంభించెను. "ఈబిల్లు బ్రిటనుకు సంపూర్ణవిజయము చేకూర్చవలెనను ఒకేఒకముక్కమీద ఆధారపడుట" గా తనకు కనుపించుచున్నదని క్లార్క్ చెప్పెను.

అధ్యక్షులవారు చాలా ఉద్రేకపూర్వకంగా చెప్పిరి "దాస్యంలోపడివున్నప్రపంచం యుద్ధంకంటే అధమం, మరణంకంటెకూడాఅధమం. అవసరమయ్యేపక్షంలో మేము పోరాడుటకూడా పోరాడుతాము."

ఇదివరలో అరువుకవులుబిల్లుకు అనుకూలంగా వోటుచేసిన డెమోక్రాట్ సభ్యుడగు సెనేటర్ రినాల్డ్సు గారు ఫిబ్రవరి౨౦వతేదిన సెనేటులో ప్రతిఘటించినాడు, ఒకదీర్ఘోపన్యాసంలో ఇతడు ఈబిల్లువల్ల అమెరికా యుద్ధంలోదిగవలసివస్తుందనీ బ్రిటన్ ప్రచారంవల్ల అమెరికాప్రజలు బెదరినారని చెప్పినాడు.

ఫిబ్రవరి౧౭వతేదిన జపానుశాసనసభలో విదేశాంగమంత్రి మత్సువోకా "అరువుకవులుబిల్లును అమోదించినందువల్ల అమెరికా బ్రిటనుపై జరుపుచున్నయుద్ధంలో ప్రధానపాత్రవహించినట్టు అవుతుంది, దీనికి కారణం ఈబిల్లు అమలులోకివచ్చేసరికి ఆయుధాల ఉత్పత్తి చాలకపోవుటే" అని చెప్పెను.

### రష్యా, ఇంగ్లాండుల రాయబారాలు

లండనులో ఫిబ్రవరి ౧౭వతేదీన ఆంగ్లో-సోవియట్ రాయబారాలలో పెనుకటికంటె దెప్పదగిన అభివృద్ధియేమీ లేదని కామన్సుసభలో ప్రశ్నలకు సమాధానంగా ప్రభుత్వప్రతినిధి తెలియజేసెను కొన్నివారాల క్రిందట జవాబిచ్చిన తర్వాత

(౨వ పేజీ చూడుడు)

# మనభారతదేశము

★

మన మెందుకు దరిద్రులముగా ఉన్నాము?
మన మంది ఎందుకు తొందరగా చనిపోతారు?
మన భూములెందుకు మంచి పంట ఇయ్యవు?
మనకు కూడు సరిగా దొరకదెందుకు?

## మసానీగారి నిర్ణయము

(మినూమసానీగారు ఇంగ్లీషులో "ఆవర్ ఇండియా" అను గ్రంథము ప్రకటించినారు. దాని వెల రూ. ౨-౧-౨-౦కట్టారు. అందు ౧౦౦ ఆకర్షణీయ బోధకరమగు చిత్రాలున్నవి. అందలివిషయాలు పిల్లలు, పెద్దలు కూడా బాగా తెలుసుకొనదగినవిగా ఉన్నవి. ఇంగ్లీషు చదువగలవారందరు ఆగ్రంథాన్ని బాగా చదువవలెను. తెనుగులోకి ఎవరైన ప్రచురించితే మన ఆంధ్రులకు చాలా ఉపకారం చేసినవారుగా ఉందురు. ఈ గ్రంథములోని కొన్ని విషయాలను ఇచ్చట ఎత్తి యీ క్రింద ప్రచురించుచున్నాము. గో. ప)

మొత్తము ప్రపంచజనసంఖ్యలో ఆయిదవవంతుమంది భారతదేశములో నేఉన్నారు మనదేశపైశాల్యము ఇంచుమించు ౧౮ం లక్షల చదరపుమైళ్లు. యూరోపులో కొన్ని చిన్న దేశాలము చ్చట చాలావినుచుందుము. అవి మన ఒక జిల్లాతో సమానము. హిట్లరు గతసంవత్సరం కబళించిన డెన్మార్కు దేశము లోకంటే మన విశాఖపట్టణంజిల్లాలో ఎక్కువమంది ఉన్నారు. ప్రపంచములో అన్ని దేశాలలో ఏవిధమైనశీతోష్ణస్థితి కలదో అన్నివిధాలా మనదేశమందు కలదు. సింధులో ౧౨౫ డిగ్రీలకాక ఉండును. హిమాలయములో మంచు నిరంతరం ఉండి ౧ డిగ్రీకాక కూడా లేదు. అస్సాములోని చిర్రాపుంజీలో ౪౫౦ అంగుళాల వాన ఏటేట కురియును. సింధులో ౩ అంగుళాల వర్షమే కురియును. మనదేశములో అన్నితరహాల జాతులున్నారు,

మన ఆస్తి ఏమి? అంటే మ-ఘ-వ-నిజాంగారి సొంతద్రవ్యముకాదు, ధనికుల కోట్ల ద్రవ్యముకాదు. మన ఆస్తి ఎండ, వాన, గాలి, నదుల, గనులు భూమి, పాడి, పంట. ఇతర దేశాలలో ఒకటిదొరికితే ఒకటి దొరకదు. ఇంగ్లాండులో సేపుపండ్లు దొరుకును, అరేబియాలో అవిదొరకవు ఇంగ్లాండులో వివిధ కూరగాయలు ఇతర దేశాలలో దొరకవు. మనదేశములో అన్ని పండ్లు, అన్ని కూరగాయలు, అన్ని ధాన్యాలు దొరుకును. దేశసంపద ఆరోగ్యవంతులైన ప్రజలలో నే ఉన్నది.

మనదేశములో ౧౭ కోట్ల పశువులు (అనగా వ్యవసాయానికి పనికివచ్చే పశువులు) ఉన్నవి. ౮ కోట్ల ౭౦లక్షల మేకలు కలవు. గోధుమపంటలో రష్యా(ప్రథమ స్థానం పొందినది) తర్వాత అమెరికా, తర్వాత కనడా, తర్వాత ఇండియా. వరిలో మొదటిది చీనా, రెండవది ఇండియా. చక్కెరలో మొదటిది ఇండియా. పొగాకుపంటలో మొదటిది అమెరికా, రెండవది ఇండియా. తేయాకుపంటలో మొదటిది చీనా, రెండవది ఇండియా. మనదేశంలో రాతిబొగ్గు చాలా ఉన్నది. కాని అన్ని దేశాలకన్న వనరులు కొంచెము తక్కువ... అదేవిధంగా మనదేశంలో ముడి ఇనుము చాల యెక్కువ కలదు కాని దాన్ని మనమే అందరికంటే తక్కువగా ఉపయోగించుకొనుచున్నాము.

ఒక కుటుంబము, అనగా అలుమగలు ముగ్గురు పిల్లలు కల ఆయిదుమంది కుటుంబము, ఏదో విధంగా బ్రతుకవలెనంటె నెలకు ౨౭ రూపాయీలైనా కావలెనని అర్థశాస్త్రపండితులు నిర్ణయించినారు. కాని అట్టి ఆదాయం లేనందున శిశువులకు కూడు లేక పాలులేక ఆరోగ్యము చెడి ఏటేట లక్షలు లక్షలు చనిపోవుచున్నారు. ప్రపంచములోని శిశువుల మరణసంఖ్యలో మొదటిది చిల్లీ దేశము. రెండవది మనదేశం, మూడవది జపాను. మనదేశములో జనులసగటు ఆయుర్దాయము ౨౭ సంవత్సరాలే. ఈజిప్టులో ౩౦ ఏండ్లు, జపానులో ౪౩, రష్యాలో ౪౫, ఫ్రాన్సులో ౫౭, కనడాలో ౬౧, అమెరికా సంయుక్తరాజ్యములో ౬౨, నార్వేలో ౬౨, స్వీడనులో ౬౩. న్యూజీలెండులో ౬౭ సంవత్సరాలు. కారణం ఏమి? మనజనుల ఆదాయం చాలా తక్కువ. సగటుపై మనదేశములో ప్రతివానిసంవత్సరాదాయము ౭౫ రూపాయీలు.

మనదేశములో నూటికి ౯౦ మంది గ్రామాలలో జీవింతురు, నూటికి ౭౦ మంది వ్యవసాయముపై ఆధారపడియున్నారు. మొత్తము ౭ లక్షల గ్రామాలు మనదేశములో ఉన్నవి. ౧౦౦ మంది వ్యవసాయకులలో ౭౫ మంది భూమిలేని కూలిపనిచేసేవారు ౧౯౨౧లో ఉండిరి. పదేండ్లలో అనగా ౧౯౩౧లో ఈసంఖ్య ౪౦౭ వరకు పెరిగెను,

సగటుపైపేరికికూలి దినానికి ౩ లేక ౪ అణాలు దొరకును.

ఇంగ్లాండులో ప్రతిఎకరములో ౨.౨౫ రూపాయీల పంటను అచ్చటి వ్యవసాయకులు పండించుచున్నారు. మరి మనభూములు వారిభూములకంటేమేలైనవి కదా! మనమెందుకు పండించకూడదు? మనము ఎకరములో సగటుపై ౫౬ రూ. పంటనే పండించుచున్నాము. ఇంగ్లాండులో ఒక ఎకరంలో ఏటేట ౨౧౦౦ పౌనులేక ౪౦౦౦ సేర్ల తూకము ధాన్యము పండించుచున్నారు. మనదేశములో ౭౯౦ పౌనుల పంటనే పండించుచున్నాము. చెఱుకుపంట జావాలో ఎకరానికి ౪౦ టన్నులు పండును. మనదేశములో ౧౦ టన్నులే పండును మనము ఎకరానికి ౯౮ పౌనుల పంటమాత్రమే పండించుచున్నాము. అమెరికావారు ౨౦౦ పౌనులు పండించుచున్నారు. ఈజిప్టువారు ౪౫౦ పౌనులు పండించుచున్నారు దీనికేమికారణం?

భూమిలో నైట్రోజెన్, పటాసియం, ఫాస్ఫరస్, జీడిపప్పు, [illegible] ముఖ్యపదార్థాలు కలవు. ఇవి తక్కువైనా పంట తక్కువ పండును మనమంది భూములకు మంచి ఎరువులు ఇయ్యరు. పేడలో పై నాల్గింటిలో ౩ పదార్థాలున్నవి దానివిలువను గుర్తించక దానిని పిడుకలుగా చేసి కాల్చివేయుచున్నారు. అయితే మాకు వంటకు కావలసినది ఎట్లు? అందురేమో, కట్టెలున్నవి గనుక వాటిని వాడవలెను, పేడను ఎప్పటికిని వాడకూడదు

ఎరువులేని ఒక ఎకరా భూమిలో ౧౨౨౪ పౌనుల తూకము ధాన్యమున్న, ౨౧౭౪ పౌనులగడ్డియున్ను పండునని తెలిసినది. దానిలో ౪ టన్నుల పేడ ఎరువువేస్తే ౩౫౫౬ పౌనుల ధాన్యము ౪౭౭౫ పౌనుల గడ్డి పండును. పేడను బదులుగా ఎముకల పొడి, సాల్టుపీటర్ వేస్తే ౪౩౯౫ పౌనుల ధాన్యము ౬౧౭౨ పౌనుల గడ్డి పండును. పత్తిపంటకు వేరుసెనగపిప్పి, ఫాస్ఫేట్లు, కలిపివేస్తే నాల్గింతల పంటపండును. మనదేశములో అడవులు సమృద్ధి, కాని వాటివల్ల మనము లాభం పొందుటలేదు. ప్రతి గ్రామంలో కొన్ని ఎకరాలు చెట్లుపెంచేదానికి ఏర్పాటుచేస్తే గ్రామంలో సమృద్ధిగా కట్టెలు లభించును

మనదేశంలో ౨౭౦ లక్షల ఎకరాలకు కాలువలనీరున్ను, ౧౨౦ లక్షల ఎకరాలకు బావులనీరున్ను, ౬౦ లక్షల ఎకరాలకు చెరువుల నీరున్ను సప్లయి అవుతున్నది భారతదేశంలో ౧౩౫ లక్షల బావులున్నవి. అయినను ఇంకా పదింతల భూమికి నీరు సప్లయి అయ్యేటట్లు సులభంగా చేయవచ్చును. మనరైతులు పశువులను సరిగా పెంచే శక్తి లేనివారైయున్నారు. ఒరిస్సాలో కొన్ని గ్రామాలలో ఒక్క ఆవైనా లేదు. అప్పుడప్పుడు కరువువస్తే లక్షల పశువులు చచ్చిపోవును. గతసంవత్సరము సింధులో థార్ పర్కార్ అనే జిల్లాలోని ౬౭౧౦౦౦ పశువులలో కరువువల్ల ౪౬౯౦౦౦ చచ్చెను, ౧౧౫౦౦౦ పశువులను వేరే జిల్లాకు పంపిరి, [illegible] తక్కువవి దిక్కులేక పోయి చావవలసి వచ్చెను. ప్రపంచములోని కోట్ల వ్యవసాయపశువులలో ౧౭ కోట్లు మనదేశంలో నే ఉన్నవి. ఈజిప్టులో ౧౦౦ ఎకరాలకు ౨౫ పశువులుండగా, హాలెండులో ౩౮ ఉండగా, మనము ౧౦౦ ఎకరాలకు ౬౭ ఉంచుతాము. ౧౦౦ ఆవులలో, ౯౦ ఎండిపోయి ఉండును. తక్కినవి దినానికి ఒక టీస్పూను తూకము పాలిచ్చును. ఇతరదేశాలలో ఒక్కొక్కటి పశువు ౫౦ పౌనుల పాలిచ్చును. మనదేశంలో ౧౭ కోట్ల పశువులనుండి యెన్ని పాలు లభించునో జర్మనీలో అన్ని పాలను రెండున్నర కోటి పశువులనుండే తీయుచున్నారు.

మన రైతుకు సంవత్సరానికి ౨౦౦ రూపాయీల ఆదాయమున్నా, అందులో ౫౦ రూపాయీలు షావుకారికి వడ్డీకిన్ని ఇచ్చుకొంటాడు. మిగతి ౧౫౦ రూపాయీలతో తాను, తనకుటుంబము పొట్టనుబట్టుకొనవలెను. ఇతర అవసరాలకు సరిపెట్టుకోవలెను. మనదేశములో ౧౫ కోట్ల ఎకరాలు భూమి వ్యవసాయ యోగ్యముగా ఉన్నది. కాని బీడుగానే ఉన్నది. మనదేశంలో రైతులు పొలాలను చిన్న చిన్న ముక్కలుచేసి భాగించుకొంటారు అందుచేత [illegible] ఒకరికి [illegible] ముక్కల ఒకటిరెండు ఎకరాలు మాత్రమే ఉండును. [illegible] సాగుచేయు

చున్నారు. దానిపై ౧౩౦౦ నుండి ౧౮౦౦ పనిచేయుదురు, అభూమి తక్కువ దిగుబడి ఇచ్చును. దాన్ని మెషీనుట్రాక్టర్లతో సేద్యము చేయుదురు.

మనదేశములో ఏటేట ౨౫ కోట్ల గజాలబట్ట ఖర్చు అవుతుంది. మిల్లులనుండి ౪౦౦ కోట్ల గజాల బట్ట సప్లయి అవుతుంది. ౧౫౦ కోట్ల గజాలబట్ట చేనేతమగ్గాలపై తయారగును మిగతా ౫౫ కోట్ల గజాలబట్ట జపాను ఇంగ్లాండు దేశాలనుండి దిగుమతి అవుతుంది. మనదేశంలో ప్రతిమనిషి సగటుపై ౧౬.౪ గజాలబట్టను ఏటేట వాడుకొనుచున్నాడు.

ఇదిమిషన్లయుగము మనదేశంలో యంత్రాలు చాలా తక్కువ. మెషీన్లు అవిరితోను, నూనెతోను, విద్యుత్తుతోను నడుచును. ప్రతి మిషనుకున్ను ఇంతగుర్రపుశక్తి (హార్స్ పవర్) ఉందని అందురు. అంటే ౭ మనుష్యులశక్తి ఒకగుర్రానికి ఉందని లెక్కవేసినారు. ఒక మిషనుకు ౫౦ గుర్రాలశక్తి ఉందంటే ౧౦౦౦ మంది చేసేపని అదొక్కటిచేస్తుందని అర్థము. మనదేశములో ఇప్పుడిప్పుడు (ఎలెక్ట్రిసిటీ) విద్యుత్తుయొక్క ఉపయోగం మొదలైంది బొంబాయిలో టాటాకంపెనీ వారు ౧౬౦ అడుగుల ఎత్తునుండిపడు జలపాతాలపై మెషీనులను పెట్టి విద్యుత్తుతీసి బొంబాయి పూనా నగరాలకు సప్లయి చేయుచున్నారు మైసూరులోని జలపాతం రెండవవిద్యుత్కేంద్రము. ప్రపంచములో నూటికి ౨౨ భాగాలవిద్యుత్తు అమెరికాలో వాడుకొంటారు. రెండవదిజర్మనీ, మూడవది రష్యా, నాల్గవది ఇంగ్లండు. ఐదవది ఫ్రాన్సు, ఆరవది ఇటలీ, కట్టకడపటిది మనదేశము.

ప్రతివేయిమందికి నార్వేలో ౭౦ గుర్రములశక్తి గలవిద్యుత్తును వాడుచున్నారు. కనడాలో ౬౧౦, స్విట్జర్లెండులో ౫౧౦, స్వీడనులో ౨౦౦, అమెరికాలో ౧౫౦, ఇండియాలో ఒక్కటే ఒక్కటి.

మనదేశంలో ౧౦౦కి ౧౧ మంది చదువుకున్నారు అమెరికాలో నూటికి ౯౫మంది, ఇంగ్లాండులో నూటికినూరు, జర్మనీలో నూటికినూరు, జపానులో ౯౫ మంది చదువుకున్నవారున్నారు.

— —




5 అణాలకు 10

## హై. ఆ. సర్ అక్బర్ హైదరి గారి పర్యటనము

మరికొన్ని విశేషములు

(ఒక విలేఖరి)

మ.ఘ.వ. నిజాం ప్రభుత్వ ప్రధానమంత్రియగు రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీగారు ఫిబ్రవరి నెల ౧౧ సం॥ మంగళవారము పగలు ౧౧-౫౦ నిమిషములకు స్పెషల్ రైల్లో దిగినారు. వారివెంట క్రొప్టన్ దొరగారుకూడ తమ పరివారములతో విచ్చేసిరి. వారిరాకకు ౧౦దినముల కుముందును ఏయే సమస్త సౌకర్యార్థములు యేర్పాటైయుండెను. మూడుదినములకుమున్ను వరంగల్‌నుంచి స్పెషల్ పోలీసు వచ్చియుండిరి. మంత్రిగారు రైల్లోనుంచి స్పెషల్ ప్లాట్‌ఫారముపై దిగుటకు రైలధికారులేగాక కాలరీ యూరోపియన్ ఆఫీసరులనూ యెదురేగి ప్రధానమంత్రిగారిని సాహికటీరమున స్వాగతించిరి. తమకిచ్చిన పూలమాలలను మొహర్రంపండుగగుటచే మేను ధరింపకయే, చేముట్టిరి.

తరువాత పది నిమిషములుండి మంత్రిగారు, తమవెంటనున్న మిస్టర్ క్రొప్టన్ దొరగారు, మరియు కాలరీయూరోపియన్ ఆఫీసర్లు, కొత్తగూడెంకాలరీకి వెళ్లిరి. ఆటనుంచి తిరిగి పగలురెండు గంటలకు విడిదికివిచ్చేసిరి.

నాటిదినము రెండవ తీవ్రతగానుండినను, నీటి సౌకర్యము కాలరీవారు పెక్కు తావుల పరిశుభ్రముగ ఏర్పరచి వుంచినదానితోడు వేసవివేళ ప్రజలు వచ్చి నిలచినందులకు శ్రోత్రానందకరముగనుండెను. శ్రీవారి క్రొత్తపట్న నియామకములో చేర్చుకొన్న కొత్తగూడెం "హేమచంద్రపురపు భూభాగమును చూచుటకు విచ్చేసిరి. అచటి పుర నిర్మాణవిధానము పరిశీలనగ తెలుసుకొనుచు అనాడే ఆహేమచంద్రపురమున స్థాపింపబడిన మిడిల్‌స్కూల్ బునియాదివద్దనిలచిరి. అట్టితరి కొండపల్లి గోపాల్ రావు దేశముఖుగారు, అపుర నిర్మాణభూమి తమదైయున్నకతన శ్రీయుత మంత్రిగారిరాక సంతోషార్థమై ఆటకట్టబడే స్కూలు, టౌనుహాలు, ఆసుపత్రి, క్లబ్బు, మొదలుగాగల ప్రతిసర్కారి సహకమూల జాగాలనిమిత్తమై ప్రత్యేకించి యేర్పరచియున్న సుమారు యకరంబుభూమిని, యుగకి మామూలీగారు౧౦౦లు విలువ చేయగలదానిని సర్కారువారికి ప్రతిఫలము లేకుండగనే జరుపియిచ్చినటుల విచురిపత్రికాకముతో దొలకా అలీజనాబు అవ్వల్ తాలూకుదారు సాహెబ్‌గారికి అందజేసిరి. దానినివారు అప్పటికప్పుడే క్రొప్టన్ దొరగారికి తెలిపిరి. వారుసమయమును నుసరించి ౫౦ నిమిషములతరువాత ప్రధానమంత్రిగారికి తృతంబరుచుకొనిరి మంత్రిగారు కొండపల్లి గోపాల్ రావుదేశముఖుగారిని మృదుమధుర వాగ్భూషణతో ఆనందపరచి వెడలిరి.

సాయంత్రము అయిదున్నరఘంటలకు క్రొప్టన్ దొరగారు పురనిర్మాణోద్యమముగూర్చి అవ్వల్ తాలూకుదారు సాహెబ్‌గారికి ప్రత్యేకించి తెలుపుచు పురనిర్మాణమున వక పెద్దవోడుపైన "ఫలానివారు, ఫలానసందర్భమున నజరుపెంపయిచ్చినట్లు స్థాపించవలెననియు" ఆటులనే మనసర్కారు రఖితుంచి నకప్లాటు శ్రీ దేశముఖుగారికి బహుమతిగ సంతోషప్రకటనార్థమై యిచ్చినటుల స్థాపింపదగుననియు, తెలిపిరి. ఇట్టిసందర్భమున కాలరీకుభూమియిచ్చినచిట్టి శేషయ్య అగ్రహారీకుగారికి నకప్లాటుఫ్రీగాయివ్వవలెనని వచిరి. తరువాత విడిదికిచేరిరి. మరునాడు౧౨వతారీఖు బుధవారమున ఉదయము ౯ ఘంటలకు అధికారులందరును పాల్వంచసంస్థానమునకువెళ్ళి అచట శ్రీరాజాగారిఆహ్వానముస్వీకరించి తిరిగి ౧౨ఘంటలవరకు యెప్పటివిడుదలకు విచ్చేసిరి. అదేదినము సాయంత్రము మూడుఘంటలకు మరలబయలుదేరి భద్రాచలభద్రగిరీశుని పరిశీలించి రాత్రి సుమారు ౯గంటలవరకు తిరిగి తమతమవిడుదలకుచేరిరి. మరునాడు౧౩వతారీఖు ఉదయము ౯ఘంటలకు స్పెషల్ రైల్లో సింగరేణికాలరీస్‌కు వెళ్ళి అచటగ౦ఘంటలవరకు వివిధవిషయములను పరిశీలించుచు వర్తకసంఘాధ్యక్షులు అందజేసుకొనిన విజ్ఞప్తి తమస్వీకరించి ౧౦-౪గంటలకు ఆదేస్పెషల్ రైల్లో ప్రధాన మంత్రిగారు హైదరాబాదునకువెళ్లిరి.

## వైశ్య పునర్వివాహము

౧౫-౨-౧౯౪౧

మానుకోటతాలూకాలోని పుప్పలగూడెం గ్రామంలో యీ మాఘ బ ౩౦ రోజు శ్రీయుత శ్రీ రంగంవీరయ్యగారి జ్యేష్ట పుత్రికయగు రంగమ్మ, శ్రీ యుత కొడ్ల కిష్టయ్యగారి తృతీయపుత్రుడగు సత్యనారాయణకుయిచ్చి పునర్వివాహమహోత్సవము బ్రాహ్మణోత్తములచే జరుపబడెను. ఈవివాహసందర్భములో శ్రీయుత జగ్గల అక్కయలింగగుప్త గారున్ను, భువనగిరి నారాయణ గుప్త గారున్ను, కృష్ణమూర్తి గారున్ను ఈ గ్రామ జనసమూహములో వేటియుత్సాహుల నెదుర్కొనుచున్న దుర్గతిని ఖండించుచు, ఈవివాహము యీ తాలూకా పునర్వివాహములకు ప్రోత్సహించుచు, మార్గదర్శ ప్రాయముగా యున్నదనిమహోపన్యాసము లొసగిరి.

సంస్కారణాభిలాషి,

భువనగిరి వెంకటయ్య.

## తిమ్మాపురం

టప్పాబ్రాంచి అవసరము

ఈ గ్రామము హుజూరాబాదు తాలూకాలోనిది (150) పైనఇండ్లున్నవి ఇంతసర్కారు వారు ఈ గ్రామమందు బ్రాంచిటప్పాఖాన చేసిన బాగుండును టప్పాఖాన చేయించినయెడల యింతు ఆర్యోధ ఖర్చులుఅనగా టప్పాతీసుక పొయ్యే అతనిజీతముకొర్దులుకర్లూరిగా నేసుదరించగలను కాని టప్పాశాఖవారు యింకాయేమేఖర్చులు వలునో తెల్పగలరు మున్షీగాపనిచేయుటకు యీ గ్రామందేశముఖు గారి గుమస్తాయగు నూరూర్ మహీయద్దీన్ వొప్పుకొని వున్నాడు కాబట్టి దయామయులగు టప్పాశాఖవారు తొందరగా బ్రాంచి టప్పా యీ గ్రామమందు చేయగలరని ప్రార్థన ఈ గ్రామం అంబాలటప్పాలోనిది యెక్కడనుంచి ఆయినపుత్తరములు వచ్చినమాకు (15) రోజులకు చేరుటకష్టముగా యున్నది

విద్యాశాఖవారికి విజ్ఞప్తి

ఈ గ్రామము యింతచిన్నది అయినప్పటికి కమ్మవారు గుంటూరునుండివచ్చి యిక్కడ కాపురం వున్నారు యీ గ్రామంలో పిల్లలు యించుమించు సుమారు(40)మంది యున్నారు వీరికిచదువులేక తల్లిదండ్రులు చాలయిబ్బందిపడుతువున్నారు ఖానిగీలో యిప్పుడు యర్రనారాయణరెడ్డి గారు చదువు చెప్పుచున్నారు ప్రభుత్వ విద్యాశాఖవారు యీగ్రామమందు సాహీస్కూలు ఖాయంచేయించ గలరనిమనవి.

## విజ్ఞాననికేతనము

(ఖమ్మంమెట్టు)

నికేతనమునకు ఈ సంవత్సరముకూడా కృష్ణాపత్రికను తెప్పించి యిచ్చినందులకు శ్రీ జగ్గల అక్కయలింగంగుప్త గారికిని, ఆంధ్రజ్యోతి, భారతి, పత్రికలు తెప్పించిఇచ్చుచున్న శ్రీ పసుమర్తి వెంకటలక్ష్మయ్య గారికిని, దివ్యజ్ఞానదీపికను చందా చెల్లించి నికేతనమునకు ఉచితముగావచ్చు ఏర్పాటు చేసిన శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రి (నిడదవోలు)గారికిని నికేతనపక్షమున కృతజ్ఞతను సూచించుచున్నాము.

౧౯-౨-౪౧ } ఇట్లు కో. నారాయణరావు, కార్యదర్శి.



## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనియార్డర్లు పంపునపుడు తమ చందానెంబరు వ్రాయుటయందు తప్పక శ్రద్ధకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.



## మా చందాదారులకు సూచన

దయచేసి తాము ఉత్తరములు వ్రాయునప్పుడు తమ చందానెంబరు తెలుపగలరు.

గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ బ॥౧౩

సోమవారము

# వయస్సు ముదిరినవారల విద్య

౧౩౪౮ వ ఫసలీకి సంబంధించిన మన విద్యాశాఖ నివేదికలో పెద్దపెరిగినవారి విద్యకై ఉద్దేశించినబళ్ల సంఖ్య ౪౭ నుండి ౯౨ కును, ఆబళ్లలో చదువుకొనుచున్నవారిసంఖ్య ౧౫౮౬ నుండి ౧౭౮౯ కిని హెచ్చినట్లు తెలుపబడినది. అనగా బళ్లసంఖ్య నూటికి ౧౦వంతునను, చదువుకొనువారిసంఖ్య నూటికి ౧౨వంతునను హెచ్చినట్లైనది.

మన రాష్ట్రములో ౨౦ ఏండ్లకు పైబడిన వయస్సుగలవారిలో నిరక్షరకుక్షులసంఖ్య గత జనపరిగణన ప్రకారము ౬౯౯౪౬౬౬. కాబట్టిదాదాపు ౭౦లక్షలమంది వయస్సుముదిరిన విద్యాహీనులలో ఏ౧౭౮౯ మందిమాత్రమో ఇపుడు ప్రభుత్వమువారేర్పాటుచేసిన సౌకర్యాలనుండి విద్యనేర్చుకున్నవారైనారని అర్థము. నూటికి సంవత్సరానికి ౧౨మందివంతున చదువుకొను వయస్సుముదిరిన అక్షరాస్యుల సంఖ్య హెచ్చుచున్నచో, ఇపుడు చదువుకొను వయస్సు ముదిరినవారి సంఖ్య ౧౭౮౯మందినుండి ౬౯౯౪౬౬౬మందియగుటకు చాలఏండ్లుపట్టగలదు.

వయస్సు ముదిరినవారల విద్యకై ఏర్పాటుచేసిన బళ్ల అందుబాటు చూచినచో, మనరాష్ట్రములోనుండు పట్టణములలోను, పల్లెలలోను కలిసిఉండే ౩౩౧౨౨౨౨ ఇండ్లకుగాను ౯౨బళ్లు ఉన్నవి. విద్యావ్యాప్తి వేగముగ జరుగుటకు ఇది చాలినంత అందుబాటైన సౌకర్యముకాదు. కాబట్టి ఈవిషయములో చేయవలసినపని ఇంకను ఎంతో యున్నదని తేలినది.

ఈసందర్భమున బరోడాసంస్థానములో వయస్సు ముదిరినవారివిద్యకై చేయుచున్న కృషిని పోలికగా పరిశీలింతము. ౧౯౩౯నుండి ౧౯౪౦వరకు జరిగిన సంవత్సరంలో ఆసంస్థానమందు ౧౯౦౦౦ మందికిపైగా వయస్సు ముదిరినవారలు ప్రభుత్వమువారేర్పాటుచేసిన బళ్లలో చదువునేర్చుకొనిరి. బరోడాసంస్థానమందు ౨౦ఏండ్లకు పైబడినవారలలో చదువురానివారి మొత్తము సంఖ్య ౯౮౫౫౫౫. అనగా దాదాపు ౧౦లక్షలమంది వయస్సుముదిరిన విద్యావిహీనులలో ఇపుడు ౧౯ మందికి పైగా విద్యను నేర్చుకొనువారలై యున్నారు. మొత్తము బరోడా రాష్ట్రములో ఉండే ౯౬౨౮౮ ఇండ్లకుగాను ౧౨౨౬ తరగతులు వయస్సు ముదిరినవారల విద్యకై ఏర్పాటుచేయబడియున్నవి. ఈ అన్నివిషయములును మనరాష్ట్రములోని స్థితికంటె ఎక్కువ అభివృద్ధిస్థితిని తెలుపుచున్నవి.

మనరాష్ట్రమందలి ౯౨ వయోజనుల బళ్లలో ప్రభుత్వమునుండి ధనసహాయము పొందునవి ౩౯. ప్రభుత్వమునుండి ఎట్టిధనసహాయముగాని పొందక కేవలము ప్రభుత్వామోదమును మాత్రమే పొందినట్టి బళ్లు ౧౩. ఈభేదమునంతృప్తికరముగా ఉన్నది. ఎందువల్లననగా వయస్సుముదిరినవారల విద్యవిషయములో ప్రభుత్వ విద్యాశాఖవారు స్వయంగా నిర్వహించే బళ్లకంటె, ప్రభుత్వమువారు ఆమోదించి యిచ్చే ధనసహాయముతో ఇతరులు నిర్వహించే బళ్లే ఎక్కువ లాభకరముగాను, ఆకర్షకములుగాను ఉండును. అందువల్ల ప్రభుత్వమువారు ఆమోదించి యిచ్చేధనసహాయము పొందుబళ్ల సంఖ్య వృద్ధియగుచుండుట అపేక్షించదగినది. విద్య మాతృభాషలోనే నేర్పబడుచుండుట సంతోషము కలిగించు సంగతి. ఇపుడు చెప్పినబళ్లలో ఒక్కటియైనను జాగీరులో చేరినది కాదని విద్యాశాఖవారి నివేదికవల్ల తెలియుచున్నది. జాగీరులలో వయస్సు ముదిరినవారలలో విద్యనువ్యాపింపజేయుటకై ఎట్టి సరియైన ప్రయత్నముగాని చేయబడలేదని ఇందువల్ల స్పష్టమైనది.

బరోడాసంస్థానమందు వయస్సుముదిరినవారి విద్యకై చేయుకృషిలో గమనించదగిన విశేషాంశమొకటి ఏమనగా, చదువుకొన్న వారలు చదువుచాలించిన పిమ్మట ఆచదువుమరచిపోకుండుటకై ప్రతిగ్రామములోను గ్రంథాలయమొకటిఏర్పాటుచేసి ఆగ్రంథాలయమును వారలు ఉపయోగించుకొనుచుండునట్లు చేయుచున్నారు. ఇదిచాల అవసరమైనవిషయము మనరాష్ట్రములోకూడ మంచి గ్రంథాలయ సౌకర్యాలను గ్రామగ్రామములో ఏర్పాటుచేయుట అవసరము. లేనిచో వయోజన విద్యాభివృద్ధికై చేసినప్రయత్నము స్థిరఫలమైనది కాజాలదు.

## హిందూప్రజామండలివారి భయము

హైదరాబాదు (దక్కన్), ఫిబ్రవరి ౨౨ శివరాత్రికి పర్లీజాతరలో బిలోలీలు దోపిడులు చేయుదురన్న వార్తలరుదెంచుచున్నవి, గాన మొదలే అట్టివిషయమై జాగ్రత్తవహించి హిందువుల ధనప్రాణములను రక్షించుటకు తగినకట్టుదిట్టములనుచేయవలెనని హైదరాబాదు హిందూ ప్రజామండలివారు, జిల్లాలరక్షకశాఖ [illegible] వారికి వి. రక్షకశాఖమంత్రిగారికిని తంతివార్తా తెలిపిరి.

## వి. యన్. దీనబంధుగారి వివాహము

(ఒకవిలేఖరి)

వి. యన్. దీనబంధుగారు ఇటీవల ఒకకన్యను ఆర్యసమాజ నియమాల ప్రకారం వివాహమాడినారు. [illegible] ప్రకారం ఈ వివాహము [illegible]

# గార్లజాగీరు పరిస్థితులు

## ఖండనకు జవాబు

౨౫-౪-౧౩౫౦ ఫసలీతో జూన "గార్ల జాగీరు పరిస్థితులు"ను శీర్షికక్రింద "గోలకొండపత్రిక"లో పకటించిన ప్రకటనకు ౧౨-౫-౧౩౫౦ ఫసల "గోలకొండపత్రిక"లో శ్రీ డి. భాస్కరరావుగారొసంగిన ప్రత్యుత్తరలేఖనుజదివితిని. శ్రీవారి విమర్శపూరితమైన లేఖకు ప్రత్యుత్తరమిచ్చుటకు ముందు కొంత మనవిజేయ సాహసించుచున్నాను.

శ్రీవారితో నాకుజోర్నకల్ లో రెండుమాసములక్రితమే సమావేశభాగ్యము కలిగియుండెను. వారితో నేను గార్లజాగీరుపరిస్థితుల నాలోచించితిని అప్పుడువారేస్వయముగా జాగీరురైతులను జాగీరుప్రభుత్వమువారు అనేక బాధలను బెట్టియున్నారనియు, ప్రజలకు మేలుజేయుటకు సాహసింప వారునుమరికొందరును అన్యాయముగా క్రిమినల్ నేరములు మోపబడి బాధలకులోనై కావలసివచ్చినదనియు నానాటికి జాగీరుపరిస్థితులు ప్రజలకు బాధాకరముగనున్నవనియు వీటినివారణో పాయమవసరమనియు తెలిపియుండిరి. నేను ఈనడుమ గార్లజాగీరులో ఆంధ్రోద్యమ ప్రచారార్థమైవెళ్లి జాగీరులోని ప్రతిగ్రామమురైతులను విచారించి పైనపేర్కొనబడిన ప్రకటన గావించితిని. అయితే ఈ రెండుమాసములలో నే జాగీరుపరిపాలన మంతయు సంస్కరింపబడినదా? రైతులకు కష్టములెనట్లే శ్రీవారు ప్రకటించియున్నారు. ఈజాగీరులోని రైతుల యిబ్బందులువారికి తెలియకపోవు. స్వయముగా ప్రజాక్షేమమవలంబించి జాగీరుప్రభుత్వ కఠినచర్యలను గురించి లసివచ్చిన వారెట్లు తెలియకుండును? అయినను యిప్పుడు తమవైఖరిమార్చి జాగీరు ప్రస్తుత పరిపాలనము ప్రజలకు లాభకరముగా నున్నదని వ్రాయుటయందు ప్రత్యేకదృష్టిగలదనుటకు సందియములేదు.

వారు వ్రాసినట్లు జాగీరుపరిపాలనము ఉత్తమముగానున్న దేని యితఃపూర్వముత నేకమార్లు జాగీరు ప్రజలు శ్రీనిజాంప్రభుత్వ మాల్గుజారీ, అదాలతు అదాలతు మున్నగుకచేరీలలో మొరపెట్టుకొనుటకు కారణమేమైయుండవచ్చును? ఈమధ్య పుల్లకఅన్యాయముగా రైతులందరినుండి వసూలుజేయుచున్నారని శ్రీజాగీరుదారుగారికే తెల్లిగాంద్వారా మొరబెట్టుకొనుట కవసరమేమియుండెను? మరలమాల్గుజారీవరకుపోయి బీఘకిరూపాయి చొప్పున మానుండివసూలుచేయుచున్నారని రైతులుమొరబెట్టుకొని ప్రత్యేకమైనఅర్జునుపొందు నగత్యమేమిగలదు? మొన్న మొన్ననే కన్నాయగూడెం మొదలగుపల్లెలరైతులు మానుండిమాఫీ చేయబడిన గతసంవత్సరపురకం శ్రీకమాలుదారుగారు, యలమంచినూర్య్య, మరియు గాదెళ్ళ శివయ్యగారిద్వారా వసూలుజేయుచున్నారని శ్రీజాగీరుదారుగారికి మొరబెట్టుకొనియుండిరి. ఇటువన్నను వసూలు చేయుటకు జాగీరువారికి అధికారముగలదా? లేనిచో వసూలుచేయబడుట అన్యాయముకాదా? జాగీరునకు ఏఏమామిలాల హర్రాజు చేయుటకు హక్కుగలదు. ఎఏమామిలాలహర్రాజుచేసి డబ్బును ప్రజలనుండివసూలుచేయుచున్నారో విచారించిరా శ్రీవారు? ఇట్లు అనేక యిబ్బందులను ప్రజలుపాల్పడుచున్నను శ్రీ రాజాగారు జాగీరు సత్పరిపాలనావిధానమును తెల్లడించుట ఆశ్చర్యకరము

(౧) జాగీరుదారు, మరియు వారికుమారులు హైదరాబాదునందే యుండునని శ్రీ రాజాగారే వొప్పుకొనియున్నారు. అయితే వీరందరు ప్రభుత్వోన్నతోద్యోగములందున్నారనియు మనవిజేయుచున్నాను. సంవత్సరమునకు పదైదు సారులు వచ్చినచో విశాలమగుజాగీరులో ప్రజల నిత్యజీవితమందు గలుగుచున్నకష్టములను విచారించుచుండుటనిక్కమేని, ఈలోన శ్రీజాగీరుదారుగారిపెద్దకుమారులు గార్లవచ్చినప్పుడు రైతులనెందరిని పిలిపించి వారియిబ్బందులవిషయమై విచారించియుండిరి? అధికారుల అన్యాయము కార్యరూపమున కనులకుగన్పట్టుచున్నను ఏమిచర్యను గైకొనియుండిరి?

### భూమిపన్నులు

"ఘోరాలు ఖాల్సాలోకన్న యెక్కువగాలేవు" అనుటలోనే ఘోరాలుజరుగుచున్నవనిస్పష్టపడుచున్నది-ఖాల్సాలోనున్నదానికన్న రైతుల స్వాధీనములో యెక్కువగానున్న, యెడల తహశీలుదారు. గిర్దావర్లు ఏభాగములో పటేలుకాదరి? రను ఖాల్సామునుపోగొట్టుకొను ప్రభుత్వమే యగునేమో. కావున పట్టాలోనున్నంతే రైతులస్వాధీనములోనున్నదని నమ్మవలసియున్నది ఇదికానే నిజముకానిచో శ్రీ రాజాగారును జాగీరునకుచ్చిన తరువాత కొంతపట్టాభూమిని సంపాదించియుండవచ్చును? పట్టాలోనున్న దానికన్న వారిస్వాధీనములోనెంతభూమియెక్కువగానున్నదో తెలియజేయవలెను.

జాగీరులోని అధికారులకందరికిని విస్తారమైనభూములుగలవు. స్వంతవ్యవసాయమును గలదు తమసాగుబడికి తగినపశువులు, జీతగాండ్లు, వ్యవసాయపుపనిముట్లు అధికారులవద్దగలవా? సరిగాలేనిచో యెట్లువ్యవసాయము నిర్వహింపబడుచున్నది, ప్రభుత్వోద్యోగులు యిట్లువ్యవసాయము మొదలగు ఇతరవృత్తుల నవలంబింపవచ్చునా? లేనిచో జాగీరుదారుగారు ఏమిచర్యగైకొనియుండిరియింతదనుక?

### టప్పా

(౨౨)గ్రామములును, యిరవదిరెండువార్డులుగల జాగీరునకు ఒక్క గార్లలో టప్పాఖాన యుండినచో ప్రజలకు సౌకర్యదాయకమగుననుటయే సంశయాస్పదమైన విషయము- మా అభిప్రాయము టప్పాఖానాలు యింకనుఅవసరమనికాని ఉత్తర ప్రత్యుత్తరములు ముట్టుటలేదనికాదు- సకాలమునకు అన్నిగ్రామములవారికి జాబులుఅందుచున్నవని ప్రజలేచెప్పవలయును గాని రాజాగారు చెప్పినచో జాలదు.

### బందోబస్తు ఖర్చులు

రైతులను బిగకిరూపాయిచొప్పున ఖర్చులను అడుగలేదనికాని ఒంటిరెండు గ్రామములలో వసూలుచేయబడలేదనిగాని శ్రీరావుగారు ప్రజలచేనొప్పించగలరా? వారు సిద్ధముగానున్నయెడల మావాదమును మేము నిరూపించెదము?

అడుగనియుపల మాల్గుజారీవరకుపోయి మమ్ములను గస్తీ వ్యతిరేకముగా బిగరూపాయియివ్వమని బాధపెట్టుచున్నారని మొరపెట్టుకొని ప్రత్యేకమైన అర్జులనేల పొందవలసియుండును?

### మరమ్మతులు

నేనుమనవిజేసినది మల్కాపూరు ఆనకట్టవిషయము. జాగీరుప్రభుత్వమువారు యికముందుమరమ్మతులుచేయ సిద్ధముగానున్నచో ప్రజలుసంతోషపడుదురు,

మాల్గుజారీరకం ప్రతిసంవత్సరమెప్పుడువసూలుచేయుబడుచుండెనో ఈసంవత్సరమెప్పుడు వసూలుచేయుబడినదో విచారించితిమను, ప్రజలనడిగినను.ఈవిషయము విశదముకాగలదు.

ఇంతకుమునవియేమనగా శ్రీరాజాగారి యభిప్రాయములో గార్లజాగీరు వారిపరిపాలనావిధానమునందు సంస్కరణమేఅవసరములేదనిగాబోలు? శ్రీనిజాంప్రభుత్వంవారు కరుణామయులై విచారణకుకడంగినచో ఈవిషయము తేటతెల్లమగును. ప్రజలకు గలుగుచున్న యిబ్బందులను స్పష్టపరచవచ్చును. కావి ప్రజలు ౩౧ సంవత్సరములనుండి ఏకచ్ఛత్రాధిపత్యముగాఅధికారమునందున్న శ్రీతహశీలుదారుగారికి మిక్కిలిభయపడువారైయున్నారు. వారిపదవినలనకలుగుభీతిని ప్రజలనుండిదూరమొనర్చి రహస్యముగను, ప్రత్యక్షముగను విచారించిన సత్యము తెలియగలదు. అనూయపడుటకు మాకుజాగీరువారితో యెట్టివ్యక్తిగతమైన శత్రుభావములేదు ప్రజలకుమేలుకలుగవలయుననియే మా యుద్దేశ్యము నిజముగా జాగీరుప్రభుత్వమువారు వారిప్రజలక్షేమమునువిచారించువారైయున్నయెడల వారిపరిపాలనావిధానమునందు కావలసిన మార్పులన్నియు చేసి తెలుపగలరు. ట్లుసంస్కరించినచో వారు జాగీరుప్రజలమన్ననలకు పాత్రులగుటయేగాకతదితరజాగీర్లకు ఆదర్శప్రాయులైయుందురని నమ్ముచున్నారు,

మరియుఈవిషయములందు శ్రీనిజాంప్రభుత్వమువారు నిజముగావిచారణకు కడంగినచో తమతమ యిబ్బందులను స్పష్టముగా, నిర్భయముగాజెప్పుకొనుటకు రైతులుసాహసింపవలెను. అధికారులవలనవధియుండిన అట్లువిచారణచేయు అధికారులకు తెలుపుకొనవలయును, అయినను అధికారులకు భయపడుకాలముపోయినది. ప్రజలుధైర్యవంతులై తమకష్టనిష్ఠురములను ప్రభుత్వమునకు మొరబెట్టుకొన్నగాని మేలుకలుగదు. లేనిచో యింకనుకృంగి కృశించిపోగలరని మనవిజేయుచున్నాను,

కొమరగిరి నారాయణరావు,
కార్యకారిణీసభ్యుడు, ఆంధ్రజనసంఘము
వరంగల్ జిల్లా

(ఈ చర్చఆపబడినది గో- ప-)

# కృపాణధారణమును గూర్చి ప్రభుత్వాజ్ఞ!

## శిక్కుల తీర్మానము

హైదరాబాదు(దక్కన్), ౨౨ఫిబ్రవరి గౌలీగూడెమునగరుద్వారమునందు ౨౨ఫిబ్రవరితేదినాడు శిక్కులసభ జరిగెను- అందులో ఆయుధాలనుపట్టుకొని తిరుగగూడదని ప్రభుత్వమువారుఆజ్ఞ ఇచ్చినప్పుడు శిక్కులు గాలంగుళముల కుమించని కృపాణమునే ధరించవలయునని నిజాము ప్రభుత్వాజ్ఞపై విచారణసలుపబడి ఈ క్రిందితీర్మానము గావింపబడినది-

"శిక్కులకు మతవిధులలో కృపాణమును ధరింపుట మిక్కిలివిధియైయున్నది- ఇట్టివిషయమున ప్రభుత్వమువారొసంగిన ఆజ్ఞ అనుచితము- బ్రిటిషుప్రభుత్వమందును ఇట్టిఆజ్ఞ లేదు- ఈవార్త శిక్కులను మనస్తాపములో ముంచివైచినది- ప్రభుత్వమువారు శిక్కులొనరించిన త్యాగమును సేవనుగమనించి అన్యాయమగు ఈనిషేధాజ్ఞను తొలగించవలెను"

# పంజాబుకు స్వపరిపాలనం

## ఇండియామంత్రి ప్రవచనం

ఫిబ్రవరి ౨౦వతేది బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో ఇండియాకార్యదర్శి వోకజాబితానమొంబర్లకునివేదించెను. ఇండియాలోని వేర్వేరురాష్ట్రములలోనుండి యుద్ధసైనికసేవచేయుటకు ఐచ్ఛికముగా సిద్ధపడినవాలంటీరుల సంఖ్యావివరములు ఆజాబితాలోకలవు. పంజాబునుండి చాలా ఎక్కువ మంది వాలంటీర్లుగ చేరిరి.

ఆటువంటి రాష్ట్రమువారికి స్వపరిపాలనమొసంగవలదా అనిసర్ ఆల్ఫ్రెడు నాక్సుగారు అడిగిరి,

ఇండియాకార్యదర్శి అందు పంజాబురాష్ట్రములో స్వపరిపాలనగల రాజ్యముగాసేయున్నదని జవాబిచ్చిరి.

యుద్ధప్రారంభమునుండియు ప్రతిరాష్ట్రములోను సేనలోచేరుటకుముందు వచ్చినవారిసంఖ్యలు పోయిన సెప్టెంబరుఆఖరువరకు ఇట్లున్నవి:—

సరిహద్దురాష్ట్రములు ౫౫౫౦౬, పంజాబు ౪౮౦౩౬, సం॥ రా॥ ములు ౧౨౨౨౨. ఢిల్లీ ౪౦౬. మదరాసు ౯౮౯౭, బొంబాయి ౭౬౫౬. బీహార్ ౩౧౦. మ॥ రా॥లు ౮౯౯ ౧౧౩, ఒరిస్సా ౨, అసాము ౧, బెలూచిస్థాన్ ౮.

# సింధు మంత్రివర్గ స్థితి

## డా॥ రాజేంద్ర ప్రసాదు గారి ప్రకటనము

సింధుమంత్రివర్గస్థితివిషయమై కాంగ్రెసు పార్టీ అవలంబింపవలసిన వైఖరిగూర్చి సింధుఅసెంబ్లీపార్టీకి ప్రత్యుత్తరువులు జారీచేయబడలేదని డా॥ రాజేంద్రప్రసాదుగారు చెప్పిరి ఇటీవల సింధులోజరిగిన వ్యవహారములవిషయమై కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారు సంగతులకుగాను వేచియుండిరి. సింధుఅసెంబ్లీకాంగ్రెసుపార్టీనాయకులు అందువిషయమై తమసలహాకోరియుండలేదు. అయినను ప్రధానిమీర్ బండేలీఖాన్ గారుఅజాదుఒడంబడికనుగౌరవింపనిచో కాంగ్రెసువారు వారికిసహాయము నిరాకరింపవలసివచ్చునని డా॥ ప్రసాదుగారుచెప్పిరి.

అజాదు ఒడంబడికను నిరాకరింపవలసినదని జిన్నాగారు గావించియుండినఉత్తరువులకు కాంగ్రెస్, అల్లాబక్షు, హిందూపార్టీలు దుఃఖము వెలిబుచ్చుచున్నవి- ముస్లింలీగుపార్టీవారు సంతసించుచున్నారు

హిందూమంత్రియగు రాయ్ సాహెబు గోకుల్ దాసుగారు ఈక్రిందివిధముగా చెప్పిరి:—

ఈఒడంబడికకు హిందువులుకట్టుబడియున్నారు- ముగ్గురుముస్లింలీగు మంత్రులు ఒడంబడికను నిరాకరింపవలెనని జిన్నాగారు సలహానిచ్చుచుండుటచే కాంగ్రెస్ అల్లాబక్షుగ్రూపులతో కలిసి మేముచేయదగినది స్పష్టమే- మంత్రివర్గమునుండి మేము రాజీనామానిచ్చి ముస్లింలీగు మంత్రులపై విశ్వాసరాహిత్య తీర్మానము ప్రతిపాదింపవచ్చును-

## బ్రిటిషు కార్డులకై అవస్థ

**మధిర తాలూకా తల్లాడ టప్పాఖానాలలో బేరములు**

చిన్నచిన్న గ్రామములందుండు పౌరులు టప్పాఖానాలకువెళ్లి బ్రిటిషుగ్రామములకు వుత్తరములువ్రాయుటకు కల్దారు 3 కానులు కార్డుకు యిచ్చినను కార్డుయివ్వక కార్డుఒకటింటికి హాలి అణాయిచ్చినకేకాని యివ్వమని టప్పాఖానా అధికారులు అనుచున్నారు. టప్పాఖానాలలో బ్రిటిషుకార్డు, కవరులకు కల్దారు యిచ్చినను పట్టకర్దని నిజాంగవర్నమెంటువారు చెప్పినట్లు టప్పాఖానాఅధికారులు చెప్పుచున్నారు. ఈ విషయంలో గవర్నమెంటువారు తగుచర్యలుతీసుకొనగలరని ప్రార్థన.

మల్లివరపు రామారావు వ్రాలు.

— —

## కీ. శే. ముక్క లక్ష్మన్న గుప్తగారు

సుప్రసిద్ధ వైశ్యకులరత్నభూషణులును ఆసిఫాబాదపురజనసంఘ కార్యనిర్వాహకులునగు ముక్క లక్ష్మన్న గుప్తగారు కులమతివిచక్షణా వివుక్తులు. వీరిమేధాశక్తి, జాతీయత మిగులప్రశంసనీయాంశములు. వృద్ధాప్యమున ౩౦ మరియు ౩౨ సంవత్సరముల వయస్సుగల పుత్రపౌత్రులిద్దరు మరణించుటవలన వీరిహృదయముపైగొప్ప దెబ్బతీయబడెను. ౧౪ మరియు ౧౩ సంవత్సరములవయస్సుగల పుత్రపౌత్రులనిద్దర నిరాధరులగావించుచు ౧౨-౨-౪౧ వ. గురువారము ఉదయము ౫-౩౦లకు కీర్తిశేషులైరి. వీరి ఆత్మకు యీశ్వరుడు శాంతిచేకూర్చుగాక యనుచు వీరి కుటుంబముయెడ మా హార్ధికసానుభూతిని తెలియపరచుచున్నాము.

ఇట్లు
జీ. యస్. గుప్త.
(అధ ఆర్గనైజర్)

## పద్మశాలి పంచాయతిసంఘము (జోగిపేట)

— —

ఈసంఘమునందు మార్గశిర శు ౧౦ సోమవారము రాత్రి సభజరిపి సమావేశమై స్థాపించి, ఈ క్రిందికార్యవర్గ మెన్నుకొనబడినది:—

శ్రీయాదగిరి బాల్ శెట్టిగారు అధ్యక్షుడు
శ్రీబండారి బాలకృష్ణయ్యగారు ఉపాధ్యక్షుడు,
శ్రీశిద్దిపేట వెంకటరాజయ్యగారు కార్యదర్శి,
శ్రీమంత్రి వెంకటరామయ్య గారు { స. కార్యదర్శి కోశాధ్యక్షుడు.

మరికొందరు సాధారణసభ్యులు నియమింపబడిరి. ఎల్లరి ఆమోదముతో పంచాయతులందు తీసికొనుదండుగలు, శుభాశుభ కార్యములందు జరుగు మధుమాంసపువిందులు యిత్యాది దురాచారముల నాపుటకు సంబంధించిన నీనియమావళి సిద్ధపరచబడినది. ఈ మాఘ బ ౫లు జరిగిన శ్రీయుత పడిగె జోగయ్యగారి కుమార్తెవివాహసమయమున ఆరంభమునుండి తుదివరకు సక్రమపద్ధతులపై కార్యము జయప్రదముగా ముగింపబడినది.

ఇట్లు
కంది నాగయ్య,
పద్మశాలియువజన సంఘకార్యదర్శి,
జోగిపేట.

— —

## బిచ్చగానికిజుర్మానా

— —

ఫిబ్రవరి ౧౩ వ తేదిన సికింద్రాబాదు (దక్కన్) పట్టణములో ఒకబిచ్చగాడు ముసలివానొకనిని చిన్నబండిలోనుంచి ఆబండిఈడ్చుకొని పోవుచు బిచ్చమడుగుచుండగా ఖెమ్సుస్ట్రీటువద్ద పోలీసులు–తనిని అరెస్టుచేసి సికింద్రాబాదు రెండవ మేజిస్ట్రేటు గారి సన్నిధికితెచ్చిరి. అక్కడ ఆ బిచ్చగానికి రూ ౨ లు జుర్మానావిధించబడెను.

— —

## ప్లేగు

హైదరాబాదు (దక్కన్) నగరములోను, దానిపరిసరములందును షంషాబాదు, కాలికమాను, సిద్ధంతి ఉప్పుపల్లి, బేగంబజారు గ్రామములు ప్లేగుసూషితములని ప్రకటించబడినవి.

— —

## నీరుడుకు ముందు లేక తరువాత

శుక్లముపడిపోవుటవ్యాధికిగురై, ఈవ్యాధివల్ల పురుషునియొక్క పుంసత్వము నష్టమైపోవును. తెలివైనవారలు యీవ్యాధికి వెంటనే చికిత్సచేయించుకొందురు. ఈవ్యాధికొరకై మేము "జోహర్ మర్దుమీ" అను ఔషధమును తయారు చేసియున్నాము. దీనివల్ల వేలకొలదిమందికి గుణముమాపినది–యిదేగాక సోజాక్, కుపుంసకత్వము, కీలునొప్పులు, మొదలైనవాటికి ఆపరేషన్ కాకుండా 40 రోజులలో గ్యారంటీగా చికిత్సచేయుదురు. యిది యూనానీమందు.

ప.చయ సమయము: ఉ॥ 8నుండి, సా॥ 3నుండి

లక్ష్మీబాయినర్సు–ఢిల్లీ.
యింటి నెం 201/2 తోపుఖానాస్ట్రీటు

## రైల్వే రిక్రియేషన్ క్లబ్బు జూబిలీమంటపము

ప్రధానమంత్రిగారు ప్రారంభోత్సవము జేయుట

సికింద్రాబాదు, ఫర్వరి ౧౫

ఎ-ఛు-ఎ-నిజాంస్టేటు రైల్వేవారి రిక్రియేషన్ క్లబ్బువారు క్రొత్తగా ఏర్పాటుచేసిన "రిక్రియేషన్ గ్రౌండు" (వినోదస్థానము) వద్ద ఎ-ఛు-ఎ నిజాం ప్రభువుగారి రజతోత్సవజ్ఞాపికగా ఒక మంటపము నిర్మించబడినది. దానికి ప్రధానమంత్రి రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారు గడచిన టి రోజు సాయంకాలము ప్రారంభోత్సవము జరిపిరి. నవాబ్ అలీ జంగ్ బహదూర్, టాస్కర్ మెహిదియార్ జంగ్ బహదూర్, ఖుస్రూజంగ్ బహదూర్, రాజధర్మకరణ్ బహదూర్, గౌ॥రెసిడెంటు గారి గార్యదర్శియగు యగర్టన్ మున్నగు గొప్ప ప్రభుత్వోద్యోగులు ఈ ఉత్సవదర్శనార్థము విచ్చేసిరి. మొదట ఆటలపోటీలు మధ్యాహ్నము ౨౹౹గంటలనుండి జరిగెను. ఆటలపోటీల తర్వాత క్లబ్బు యొక్క అధ్యక్షుడును నైజాం రైల్వే చీఫ్ కమర్షియల్ మేనేజరున్ను అగు ఏబ క్సల్ గారును ఉపన్యసించిరి. తర్వాత ప్రధానమంత్రిగారు ప్రారంభోత్సవము జరిపిరి. వారు ఉపన్యసించు ఇటువంటి రిక్రియేషన్ గ్రౌండు ఇండియాలో వారెక్కడనైన ఉన్నదా యనునది సందేహమనిరి. నైజాం రైల్వే జనరల్ మేనేజరు అగు స్లాటర్ గారు ఉపన్యసించుచు ఖాన్ బహదూర్ అహమ్మదిఅలా ఉద్దీన్ గారు క్లబ్బుకు గాను ఒక ఊతకోలను రూ ౧౦౦౦౦ ఖర్చుతో కట్టించి ఇచ్చెదమని వాగ్దానము చేసినట్లు తెలిపిరి.

క్లబ్బు కార్యదర్శి బిల్గ్రామిగారు ఉపన్యసించుచు హైద్రాబాదులో జరిగినవాలుగు టోర్నమెంటులలోను తమ క్లబ్బువారె రెండవసారి కూడ గెలిచినారనిరి.

తరువాత స్లాటర్ గారి పతిబహుమతులు గెల్చిన వారికి బహుమానములను అందజేసెను.

## ప్లేగు

బీదరుజిల్లాలోని జహీరాబాదు తాలూకాలో పర్లి గ్రామంలోను, పర్భణీజిల్లాలోని పాత్రి తాలూకాలోని ఉమ్రా గ్రామంలో ప్లేగు జెచుటవల్ల రెండుతాలూకాలు ప్లేగుసూచితముచేయని ఆరోగ్యశాఖాధికారులు ప్రకటించినారు.

## సర్ అక్బర్ హైదరిగారు

సర్ అక్బర్ హైదరిగారు మూడురోజులసంచారము ఫర్వరి ౧౩ వ తేదీ ఉదయం వరంగల్లు జిల్లాలోని ఎల్లందును దర్శించుటతో ముగిసినది. ఎల్లందులో శ్రీవారు రెండుగంటలుండి ఆటవీశాఖవారిబడిని, ఇతరభవనాలను దర్శించిరి. అడవిలో వచ్చు పదార్థములయొక్కయు, వాటితో తయారుచేయబడి ప్రతిదినము వాడుకొనబడు వస్తువులయొక్కయు ప్రదర్శనమును శ్రీవారు దర్శించిరి. తర్వాత వారు సింగరేణి బొగ్గుగనులను చూచిరి.

అదేమధ్యాహ్నము వారు ప్రత్యేకమైన రైలుబండిలో హైదరాబాదునగరానికి విచ్చేసిరి. విచ్చేసిన తర్వాత బాలెహంఘామతు సమావేశములో పాల్గొనిరి.

## పద్మశాలి సంఘంలో ప్రౌఢ వివాహము

(ఒకవిలేఖరి)

హైద్రాబాదు (దక్కన్) ఫర్వరి ౧౭

హైద్రాబాదు లేది ౧౪ ఫిబ్రవరిన బిగబాను బాగులో వైవివాహము జరిగినది. వరుడు సోలాపురనివాసి. పద్మశాలిపత్రికసంపాదకులు, శ్రీయుత బూస్గుల రామకృష్ణయ్యగారు. వధువు శ్రీ యెల్లుల వెంకటస్వామిగారి కూతురు చి॥ యశోదాదేవి. వయస్సు ౧౭ సం॥ ఈ వివాహము స్వకులపౌరోహితులచే నవీనసంస్కార పద్ధతులతో జరుపబడినది. నిజాంరాష్ట్ర పద్మశాలి యువజనసంఘంవారి నేతృత్వముక్రింద నీవివాహము చాల ఆదర్శవంతముగా జరుపబడినది. ఈ వివాహసందర్భమున పూర్వాచారపు వైకట్నదులు మానుకొని యువకసంఘంవారికి వరునిపక్షమున ౧౦ రూ.లు వధువు పక్షమున ౫ రూ.లు విరాళముగా సంగబడినవి. ఈ ద్రవ్యం సంఘోన్నతివిషయమున విద్యాదిసౌకర్యముల కుపయోగింపబడును.

ఈవివాహమునకు "పద్మశాలీయువక పితామహ" శ్రీమాన్ వడ్డేపల్లి విఠోబా సోలాపుర మ్యునిసిపల్ ప్రెసిడెంటు పులిమల్లయ్యగార్లు మొదలగు ప్రముఖులు విచ్చేసియుండిరి.

